శ్రీశుభమస్తు.

శ్రీవేంకటేశ్వరాయనమః




# ఉత్తరగోగ్రహణము.

## మహానవమి పద్యములు.

ఇయ్యది

బాపట్లతాలూకా వెల్లటూరుగ్రామవాస్తవ్యులగు

బ్రహ్మశ్రీ చిల్లర వేంకటేశ్వర కవిగారిచే

రచియింపఁబడి

తత్ప్రియశిష్యుండగు

ఇక్కుర్తి తిరుపతిరాయనిచేఁ

ప్రకటింపఁబడియె.



---

గుంటూరు వాణీ ముద్రాక్షరశాలయందు

కే. బి. కృష్ణారావుచే

ముద్రింపఁబడియె.

1915. [వెల 1 అణా.

# పీఠిక.

ఈచిన్న పొత్తము నస్మద్గురుండును బ్రహ్మశ్రీ చిల్లర సుబ్బయార్యుని పుత్రుఁడునగు వేంకటేశ్వరకవిగారు ఆ 1912 వ సంవత్సరము సెప్టెంబరు నెలలో రచించిరి. ఆశ్వయుజ శుద్ధ దశమి పాండవులజ్ఞాతవాసము చేయునప్పుడర్జునుండు కౌరవ యోధులనోడించి విరాటుని యావుల మరలించుకొని వచ్చిన దినము. దీనినే మనవారు విజయదశమియని వాడెదరు. ఈపండుగకు విద్యాభ్యాసమొనరించు బాలకులు మహానవమి పద్యముల నభ్యసించుట వాడుక. ఇదివఱకుండఁబడినవి లక్షణవంతములుగాక యేవియో రోకటిపాటగాఁ జదువువారికిని వినువారికిని విసుగుపుట్టించునట్టివిగా నుండుటంజేసి పైకథను ద్విపదలుగను గీర్తనలుగను బద్యములుగను గొన్నికొన్నిచోట్ల సంభాషణరూపంబుగను నుండునట్లు మిక్కిలి రసవంతముగా రచియింపఁబడియె. బాలకులభ్యసించుట కొఱకుఁ గథను సంగ్రహపరచిరి. పొత్తముచిన్నదైనను సలక్షణమై పండిత పామర రంజకమై యొప్పుచున్నది. ముంజేతికంకణమున కద్దమేటికి? పుస్తకమును జూచిననంతయు విశదముగాఁగలదు.

నెల్లూరు,
రాక్షసనామ సం॥
ఆషాఢశుద్ధ ౧౦ గురువారం



ఇట్లు
సుధీవిధేయుఁడు,
ఇక్కుర్తి తిరుపతిరాయఁడు.

శ్రీ

హరిః ఓమ్.

కీర్తన - బేహాగ్ రాగము - ఆదితాళము.

1 శ్రీగణాధినాథుమదిని • సేవజేసెద
నాగమోక్తవిధిని విఘ్న • మడఁపనిరతము॥ శ్రీగ॥
2 వాణినలువరాణినివా • గ్వాసముసేయ
జాణనై కవిత్వమల్ల • సంస్మరించెద॥ శ్రీగ॥
3 శ్రీపతిపాదాంబుజములఁ • జేరికొలిచెదఁ
బ్రాపయిపాపములఁబాపి • రక్షసేయఁగా॥ శ్రీగ॥
4 ఎఱిఁగిసంస్కృతాంధ్రకవుల • కెల్లమున్నుగా
సరసముగనొనర్తుఁగృతిని • శౌరికరుణచే॥ శ్రీగ॥

ఆ. వె. వ్యాసరచితమైన • భారతాంతర్గత
మగువిరాటపర్వ • మందుఘనులు
ఐందుకౌరవులను • కంజయించిగో
వులమఱల్చుకథను • దెలియఁబఱతు॥

ద్వి ప ద .

ధీరులై పాండవుల్ • దేశంబులేలఁ
గౌరవాధిపుఁడుదాఁ • గనియోర్వలేక
మామయగుశకుని దు • ర్మంత్రంబుచేత
నామహనీయుల • నటకురప్పించి
ద్యూతంబునెపమున • దోఁచిసొత్తెల్ల
నాతియాద్రుపదనం • దన నవ్వులొలిచి
వనమునద్వాదశా • బ్దములువసించి

జనపదంబుల నొక్క • సంవత్సరంబు
నెరులు గుర్తిడనట్టు • లుండంగవలయు
గుఱుతెఱింగినఁబోయి • ఘోరాటవులను
వసియింపవలయుఁ బూ • ర్వపురీతినను చు
ననదృశంబగు సమ • యంబునొనర్ప
పంచపాండవులు ద్రౌ • పదిఁగూడి వెడలి
కించతో విపిన పం • క్తి నివసియించి
అజ్ఞాతవాసంబు • నాచరింపంగఁ
బ్రజ్ఞతో విరటుని • పాలవసింప
దుర్యోధనుండతి • దుర్మార్గుఁడగుచు
భార్యాన్వితులుపంచ • పాండవులెందుఁ
గలరో విచారింప • ఘనులఁబంపింప
నిలయెల్లఁదిరిగివా • రెచ్చటఁ గానమి
మత్స్యదేశాధీశు • మఱఁదికీచకుఁడు
మత్స్యాక్షినొకతె దు • ర్మదమునంగోరి
నడిరేయిగంధర్వ • నాథునివలన
విడిచెఁబ్రాణము లంచు • వినిపింపవార
లందున్నవారని • యాత్మనూహించి
క్రందుగా నలసుశ • ర్మనుముందుఁబంపి
వెనుకఁదా భీష్మాది • వీరులంగూడి
చనివిరాటుని యాల • సంతతింబట్టఁ
బట్టణంబునకు ద • గ్గఁగంపుఁబశులఁ
బట్టినిశ్శంక గో • పాలురంగొట్టి

బేహాగ్ రాగము - ఆదితాళము.

5 అంతకుమునువచ్చినట్టి • యాసుశర్మయుఁ
బంతమానను దక్షిణమునఁ • బసులఁబట్టఁగా॥ శ్రీక॥
6 మర్మమెఱిఁగి విరటుఁడాను • శర్మఁగెల్వఁగా
ధర్మజానిలజులుఁ గవలుఁ • దనయులాప్తులు॥ శ్రీక॥
7 నింకఁబురినిగలుగు సైన్య • మెల్లఁదోడురా
శంక లేక చనియె రిపుల • బింకమడఁపఁగా॥ శ్రీక॥
8 విరటుపుత్రుఁడుత్తరుండు • వీటనుండఁగాఁ
బురికి నేగిగోపకులా • కురుకు లేశులు॥ శ్రీక॥
9 పశులఁబట్టుకెల్ల విన్న • పంబు సేయఁగాఁ
కుశలుఁడుత్తరుండు గెల్వఁ • గోరెవానిని॥ శ్రీక॥

వ॥ ఇట్లుత్తరుండాలమున కేగ నుత్సహించి తనమనంబున నిట్లు వితర్కించె.

కళ్యాణి రాగం - ఆదితాళం.

ఉత్త॥ సారథి లేఁడే • సమరమునకుఁ జనఁ
గౌరవ సేనలఁ • గారించుదు నిట॥ సారథి॥
పురమునందుఁగల • పరిజనులెల్లరు
ధరణీశ్వరుతో • దాడికిఁబోయిరి॥ సారథి॥
పశుసంఘంబులఁ • బట్టవానివమా
వశమునసుంచని • పౌరుష మేటికి॥ సారథి॥

ద్విపద. అనియిట్టులుత్తరుం • డాత్రింబుతోడ
ననువైనసారథి • నరయుచుండంగ
నత్తరి ద్రౌపది • యర్జుననాజ్ఞ
నుత్తరుకడకేగి • సూ కినిటనియెఁ

బూర్వంబు పాంచాలి • పొంత నేనుండ
నుర్వింజయుని రథం • బొప్పగాఁగడపె
మన బృహన్నలమీరు • మది శంకఁగొనక
అని కేగుటొప్పు బృ • హన్నల తోడ
ననిపల్కనిట్లనె • నానృపాత్మజుఁడు
వనితరో! నేఁబేడి • వానిఁగాంచుదునె?
దురమందుఁదోడ్తొందు • దొరకకుండుటను
భరమైనఁగాని నే • వానిఁగొంపోను

వ॥ ఇవ్విధంబునఁ బలికి యుత్తరుం డర్జునిం జేరి యిట్లనియె.

మత్తకోకిలలు.

ఉత్త॥ నూతుఁజొక్కఁడు లేఁడు నాకతి • చోద్యమయ్యె బృహన్నలా
ప్రీతిఁదారుదెంచు శత్రుల • భీతినొందఁగఁజేయుదుర్

అర్జు॥ నాటిపింకుకు నాటనేర్పు • నాకు శక్యమెపోరనా
నూతకృత్యము నిర్వహించెదు • జోలి తెల్పనెయుత్తరా

ఉత్త॥ తేరుపైవసియింపుము • ధరతేజసవరించెదర్
గోరవౌఘముఁగాంచి భీతిని • గాంచబోకు బృహన్నలా!

అర్జు॥ నేరనెన్నఁడుఁబోరి కేగుట • నీవుగోరుటనట్టులే
గారవంబులఁ బ్రోలువాఁడను • బన్నఁజేయనెయుత్తరా!

ద్విపద.

అనిపల్కనుత్తరుం • డాక్షణంబుననె
ఘనరథంబునఁబూన్చి • గంధర్వచయము
నాయుత్తపడుచి బృ • హన్నలతోడ
నాయురదం బెక్క • నవసరంబందు
నుత్తరచను దెంచి • యోయన్న! యురుల

యు_త్తరీయంబుల ♦ నోపికంబోమ్మ
పా_త్రికలకుఁదెమ్ము ♦ పొమ్మంచుఁబల్క
ను_త్తరుండందుల ♦ కొప్పిపోవుచును
వారాశివిధమున ♦ బహుళమైయున్న
కౌరవసేనలం ♦ గని భీతినొంది

వ॥ ఇట్లులనియె.

శంకరాభరణరాగము - ఆదితాళము.

ఉ_త్త॥ అరదము మఱలుపు ♦ మయ్య బృహన్నల
దురమొనరింపఁగ ♦ దుస్సాధ్యంబిపు ॥ డరదము ॥

అర్జు॥ ఇటులవచించుట ♦ యేటికినుత్తర !
పటువిక్రమమునఁ ♦ బగతురగెలువుము ॥ ఇటుల ॥

ఉ_త్త॥ బాలుఁడనెన్నఁడు ♦ బవరమెఱుంగను
గూలుదుఁగౌరవ ♦ కోటివలననే ॥ నరదము ॥

అర్జు॥ ఈమతిమును నీ ♦ కేమైపోయెను
భామలునవ్వరె ? ♦ పందయితండని ॥ యిటుల ॥

ఉ_త్త॥ గురుకృపభీష్మా ♦ ఖ్యులు కడుశూరులు
గురుసుతకర్ణులఁ ♦ దరమే గెల్వఁగ ॥ నరదము ॥

అర్జు॥ జయమునుబొందుటొ ♦ చచ్చుటొకాకిటు
భయమునమఱలుట ♦ పాడిగాదు చా ॥ లిటుల ॥

బేహాగ్ రాగము - ఆదితాళము.

10 నయవిదుండు ఫల్గుణుండు ♦ ప్రియముచెప్పఁగా
భయముచేతను_త్తరుండు ♦ వాతెవెనుకకు ॥ శ్రీగ ॥

11 తిరిగిచూచినరుఁడు రథము ♦ దిగిరయంబునఁ
బరులువీపుఁజూడకుండఁ ♦ బరుగునంజని ॥ శ్రీగ ॥

12 కరమునొడిసిపట్టి యెచటి • కరిగె? దుత్తర!
అరులునవ్వభీతినొందు • టర్హమేయనిఁ ॥ శ్రీగ ॥

కం॥ భీతిఁ దేహమువడఁకఁగ
నాతురమెలుఁగునకు నడ్డ • మైనిల్వఁగఁ బె
న్భూతము సోఁకినవిధమున
నాతండిట్లనుచుఁబలికె • నర్జునుతోడఁ॥

జంఝూటిరాగము - రూపకతాళము.

ఉత్త॥ నన్నుబ్రదుకనీయ విద్ది • న్యాయమా? బృహన్నలా!
ఎన్నఁడు నేఁగీడుచేసి • యెఱుఁగనయ్యయో ॥ నన్ను ॥
కదనమనఁగ లాస్యమనుచు • మదికిఁ దోఁచెనేమొకో
అదనుగాదు పురికివేగ • నరుగవలె బృహన్నలా!॥నన్ను॥
వందనంబుసేతు నన్ను • వదలుమయ్య ప్రేమతో
నిందలేనిజయింపవశమె• యేరికైన సంగ్రామమా ॥నన్ను॥

ద్విపద.

అని యెంతవేఁడిన • నర్జునుండపుడు
వినిపించుకొనక వే • వేగమేయతని
నరదంబునొగలపై • నంటఁగఁగట్టి
త్వరితగతిని రుద్ర • ధరణికిఁజనియెఁ
గౌరవవీరులా • కథయెల్లఁజూచి
వీరుఁడెవ్వఁడొకాని • వికృతవేషమున
వచ్చుచున్నాఁడదె • బవరంబుసేయ
నెచ్చటివాఁడొకో • హీనుండుగాఁడు

వ॥ అప్పుడశ్వత్థామ యిట్లనియె.

అశ్వ॥ కం॥ నరుఁడొకఁడు దక్క నితరుఁడు
కురుసైన్యముఁజూచి గెల్వఁ • గోరంగలఁడే ?
బిఱబిఱవచ్చిన యీయు
త్తరుగతిఁగనుఁగొనమె?యతఁడు•తథ్యమునరుఁడో॥

వ॥ అనినఁ గనలికర్ణుండిట్లనియె.

కర్ణు ॥కం॥ నరుఁడరుగుదెంచు నెంతో
భరమగుదురమిప్పుడంచుఁ • బల్కెదురా నీ
నరుఁడైనఁగాని యీపుర
హరుఁడైన జయించువాఁడ • నసహాయుఁడనై ॥

ద్విపద.

అనిన దుర్యోధనుం • డప్పు డిట్లనియె
వినరయ్య మీకింత • నెత్తి(?)యేమివుడు
పాండవుండైనచో • భండనంబేల ?
చండాటవులకిప్డు • చనఁజేయవలయు
నాడిఁజేసిన సమ • యంబిదికాదె ?
వాదేల ? యనధర్మ • పరుఁడు భీష్ముండు

వ॥ వారెల్లర కిట్లనియె.

పంచచామరము.

భీ॥ నయంబుఁగోరి మీకు జీవ • నంబుసేయుఁడయ్య నేఁ
బ్రియంబుసెప్పువాఁడ నాకు • భీతియేటి కోర్పుతోఁ
బ్రదోష దశాబ్దముల్ భరించి • దర్పమొప్పఁ బిమ్మటన్
జయంబుఁగోరి వచ్చినాఁడు • సవ్యసాచిగెల్వఁడే ॥

ద్విపద.

కాన సంకేతమా • కాలంబుగడచె
న్యానంబులేదింక • యుద్ధంబొనర్పఁ
డని భీష్ముఁడాడ నా • రందఱౌననుచు
ననికిసన్నద్ధులై • రట ఫల్గుణుండు
రుద్రభూమికి నుత్త • రునితోడఁ జేరి
భద్రంబుగావాని • బంధముల్ విప్పి
ఈసమీపవుజమ్మి • నిషుసంఘముండెఁ
దీసి తెమ్మనవాఁడు • తిలకించిపల్కె

కాంభోది రాగం - ఆదితాళము.

ఉత్త॥ నరపతి సుతుఁడని • యెఱిఁగియు నన్నే
కొఱమాలినపనిఁ • జూరఁజేసెదవే॥ నర॥
అర్జు॥ కొఱమాలినపని • నెఱిఁగించుటకే
బరు నెఱుఁగనె? యు • త్తర! పైకెక్కుము॥ కొర॥
ఉత్త॥ పూతిగంధయుత • ప్రేతము ముట్టఁగ
నేతీరున నా • చేతంబొప్పును॥ నరప॥
అర్జు॥ ప్రేతము గాదది • శాతశిలీముఖ
వ్రాతము రోయకు • చేతములోపల॥ కొర॥

ద్విపద.

అనుటయు నృపసూతి • యావృక్షమెక్కి
ఘనసాధనంబుల • కట్టవిప్పటయుఁ
దద్రుచుల్గన్నులం • ధములు గావింపఁ
గాద్రవేయములంచు • గలఁతనొందంగ
నాతనిభయమెల్ల • నడఁచె ఫల్గుణుఁడు

భీతితోలంగ నా • పృథివీశ సుతుఁడు
నాయుధంబులఁగాంచి • యాత్మలో మెచ్చి
ఆయర్జునునితోడ • నప్పుడిట్లనియె.

ఉత్త॥ సీ॥ ఈసాధనములెల్ల • నేమహాత్ములవియో
తెలిసినఁ జెప్పవే • ధీరవర్య!
అర్జు॥ పంచపాండవులు చే • పట్టు మహోగ్రాయు
ధంబులియ్యవియె యు• త్తరకుమార!
ఉత్త॥ దివ్యాయుధములీక్షి • తిరుహంబునఁబెట్టి
వారందఱెచ్చోటఁ • జేరినారు?
అర్జు॥ అజ్ఞాతవాసంబు • నాచరింపఁగఁగోరి
వారీపురమునను • వచ్చినారు

ఉత్త॥ తే॥ గీ॥ ఈపురంబున నెచ్చోట • నిమిడియుండి
అర్జు॥ రయ్య మీయయ్యయొద్దనే • యధివసించి
ఉత్త॥ రేమి ద్రౌపదియుంగూడ • నింపెకలదె?
అర్జు॥ ఉంది మీతల్లికొల్వులో • నుత్తరాఖ్య!!

బేహాగ్ రాగము - ఆదితాళము.

ఉత్త॥ 13 ఎవ్వరెవరు ధర్మజాదు • లెఱుఁగఁజెప్పవే
నవ్వులాటకానుసుమ్ము • నాయభీష్టమే॥ శ్రీగ॥
అర్జు॥ 14 తలఁపు కంకభట్టయిల్ల • ధర్మరాజని
వలలుఁడనఁగ వంటసేయు • వాఁడె భీముఁడు॥ శ్రీ॥
15 వారువముల శిక్షసేయు • వాఁడె నకులుఁడు
ధీర తంత్రీపాలుఁడె సహ • దేవుఁడెఱుఁగుమీ॥ శ్రీ॥

ఉ॥ మాలినిపేర మీ జనని ♦ మన్ననలందుచుఁ గొల్చునట్టి పాం
చాలి రమింపఁగోరి ♦ కడుసాహసమొప్పఁగ నొక్క రాత్రిలోఁ
గూలఁడె మున్ను కీచకుఁడు ♦ కూరిమి తమ్ములతోడ భీముచేఁ
గాలమువచ్చి తమ్ములము ♦ గాఁదరియింపఁగలారె? యెవ్వరున్

ద్వి ప ద.

ఉత్తరుండాశ్చర్య ♦ మొంది యిట్లనియె
నుత్తమోత్తములు స ♦ ర్వోర్వీశులోపుల
కూడిగంబొనరించు ♦ టొప్పునే యకట!
ఏడాదినుండియు ♦ నెఱుఁగలేనైతి
మరణమాసన్నమై ♦ మాకీచకుండు
పరమపతివ్రతం ♦ బట్టంగఁగోరె
నంకటినెఱిఁగించి ♦ తతిగుణార్ణవుఁడు
సుందరాకారుండు ♦ శూరశేఖరుఁడు
అర్జునుండెవ్వరో ♦ యానతీవలయు
దుర్జయుండతఁడు రూ ♦ ఢుల కెల్లమిన్న

వ॥ అనిన నర్జునుండిట్లనియె.

బేహాగ్ రాగము - ఆదితాళము.

అర్జు॥ 16 దాఁపనేటికర్జునుండ ధరణీధవసుత
ఏపుమాలియున్నవాఁడ ♦ నివ్విధంబున॥ శ్రీగ॥

ఉత్త॥ 17 ఏమి యర్జునుండవైన ♦ నిట్టిరూపమా?
నామనమున శంకకలిగె ♦ నమ్మఁజాలఁగా॥ శ్రీ॥

అర్జు॥ 18 దేవదాసి యూర్వసినను ♦ దిట్టెఁబూర్వము
కావరమున, నిట్టిరూపు ♦ కలిగె నందుచే॥ శ్రీ॥

కం॥ మఱియును దశనామములే
తెలుఁగునవచ్చెను నరుండు ♦ తెల్పఁగవిని యు
త్తరుఁడధిక భక్తినాతని
చరణంబుల్ప్రాలి మిగుల ♦ సంస్తుతిఁ జేసెన్.

ద్వి ప ద.

గాండీవమును నిషం ♦ గమునుబుచ్చుకొని
పాండవుండితరుల ♦ ప్రబలసాధనము
లన్నియు భూమీరు ♦ హంబునంబెట్టి
అన్నగారాతిని ♦ నాత్మఁ జింతింప
వరరూపమును గపి ♦ ధ్వజమును జేరె
అరదంబుపై నెక్కి ♦ యవనీశసుతుని
సారథిగాఁ జేసి ♦ జ్యానిస్వనంబు
దారితాహితదేవ ♦ దత్తనిస్వనము
నొకమాత్రమ్రోయింప ♦ వ్యూహంబుఁబన్ని
సకలసేనలు సవ్య ♦ సాచిగానెఱఁగి
ధేనువులకుముందు ♦ ధీరులై నిలువ
నానరుఁడరుదెంచి ♦ యందఱంగాంచి
తన్నామబలములు ♦ త్తరునితోఁ దెల్పి
మున్నుగాగురులకు ♦ మ్రొక్కంగఁగోరి
కొన్నిబాణంబులా ♦ గురుకృపాదులకుఁ
దిన్నఁగాఁబడసన్ని ♦ ధినిఁబడవైచి
వారిమెప్పులఁబొంది ♦ వాసవాత్మజుఁడు
నారాచవితతిసై ♦ న్యంబుపైఁబరపి
విచ్చలవిడియందు ♦ విహరింపఁజూచి

చెచ్చెరఁగర్ణుండు • చేరియిట్లనియెఁ
బౌరుషంబేహీన • బలులంజయింప
శూరుండనామొద్దఁ • జూపునీప్రజ్ఞ

వ॥ అనిన నర్జునుండిట్లనియె.
అర్జు॥ తే॥గీ॥ శకునితోఁగూడి జూదంబు • సంఘటించి
కైతవంబున మముగెల్చి • కాంతయనక
సభనుద్రౌపదికట్టు వ • స్త్రంబులొలుచు
నట్టిపనిగాదుసంగరం • బనితలంపు॥

బేహాగ్ రాగము - ఆదితాళము.

19 అనుచుంబాణవృష్టిఁబరప • నర్కపుత్రుఁడు
కినుకఁగొంతతడవుపోరెఁ • గ్రీడిసమముగా॥ శ్రీ॥
20 కాందిశీకుఁడయ్యెఁ బిదపఁ • గౌరవేశుఁడు
స్యందనంబునెక్కరాఁగ • సర్వయోధులు॥ శ్రీ॥
21 తోడుసూపవారిఁ బారఁ • దోలిపార్థుఁడు
నాఁడిమెఱసియాలమునఁ • బంగనుఁగొని॥ శ్రీ॥
22 ఒక్కమొగినిమూఁగికౌర • వోత్తములపుడు
పెక్కునారసములఁ గుప్పి • పేర్చియార్చిన॥ శ్రీ॥
23 మోదమడరఁబార్థుఁడున • మ్మోహనాస్త్రము
మేదురబలుఁడగుచురిపుల • మీఁదవైవఁగా॥ శ్రీ॥

కం॥ కౌరవులెల్లఁదదస్త్రవి
దారితధైర్యులయిమూర్ఛ • ధారుణిఁబడఁగా
ధీరుఁడు నరుఁడు విరాటధ
రాధిపుసూనునిగాంచి • రయమునఁబలికెన్ ॥

## నవరోజు రాగము - ఆదితాళము.

ఉత్తర ! దిగిపొమ్మా - పోగా - లెత్తుకొనుచురమ్మా
ఇత్తరి వైరులు • సత్తువచెడి ధర • సత్తమిల్లిరదె పో
త్రికలకువే ॥ యుత్తర ॥
శాంతనవుండిది • యంతయు నెఱుఁగును • జెంతఁజేరకు
ము • పంతగించుసుమి ॥ యుత్తర ॥
వేతుగాయనిమది • భీతిని జెందక • చేతనములగతి •
నేతెరవునుగన ॥ రుత్తర ॥

## ద్విపద.

అని చెప్ప నుత్తరుం • డరదంబుడిగ్గి
చని వారితలల వ • స్త్రములకొంగులను
గోసి తెచ్చిన లేచి • కురువీరులెల్ల
నా సవ్యసాచిఁ జో • నని నేయఁగడఁగ
గాంగేయుఁడిట్లనెఁ • గదనంబువలను
భంగపాటునమూర్ఛఁ • బడియున్నవేళఁ
దలలవస్త్రంబులే • దయఁగోసెఁగాని
తలలఖండించి సం • దరము మాన్పంగఁ
గరిపురంబునకింకఁ • గదలుఁడేమనకు
మఱియాదయని చెప్ప • మరలిరందఱును
పిదపనరుఁడు వారి • వెన్నంటి తఱిమి
ఎదయందు మఱవకుం • [illegible]గుదేనంచు
నందజ[illegible]ల్పి • యరదంబుఁద్రిప్పి
మందలనుమరలించె • మాధవుండలఁచి

ఉత్పలమాల

పాండవమధ్యముండు దన • బాహుబలంబున శత్రువీరులన్
ఖండనభూమిగెల్చి నర • పాలసుతుంగొని వీటికేగి భూ
మండల భర్తయావిరటు • మన్ననలంది సహోదరాదులం
దుండుటఁదెల్పితత్పురిమ•హోన్నతినుండెయుతానుజా ప్తుఁడై

రాగము - ఆదితాళము.

24 వెల్లలూరునందుఁ జల్లర • వేంకటేశ్వరుం
డెల్లబాలబాలికలును • నిద్దిసేర్వఁగాఁ ॥ శ్రీగ ॥
జెప్పె దీనివినినజనుల • చింతలడఁగును
గుప్పలుగ ధనంబుగలుగుఁ • గోర్కెసేకురు॥ శ్రీగ॥
పుత్రపౌత్రమిత్రదాస • పుత్రికలబ్బు
ధాత్రి వృద్ధిఁబొందఁగలరు • ధర్మరతులరై ॥ శ్రీగ॥

సమస్తసన్మంగళానిభవంతు.

ఓం తత్సత్ బ్రహ్మార్పణమస్తు.

